## న టీ న టు లు

'నటరత్న' పద్మశ్రీ యన్. టి. రామారావు

కళాభినేత్రి' వాణిశ్రీ, జయసుధ, సునందిని

'కళావాచస్పతి' జగ్గయ్య B. A. [Litt.] 'నటశేఖర' సత్యనారాయణ

కాంతారావు, పద్మనాభం, ముక్కామల, సాక్షి రంగారావు

బాలకృష్ణ, సారథి, కొంగర జగ్గారావు, యస్. వి. జగ్గారావు

వి. జగదీష్, అనందమోహన్, గోపాలకృష్ణ

## సాంకేతిక నిపుణులు

మాటలు – సత్యానంద్

పాటలు – శ్రీశ్రీ, కొసరాజు, వేటూరి సుందరరామ్మూర్తి

సంగీతం – సత్యం

నేపథ్యగానం – యస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల, యస్. జానకి

కళ – తోట

మేకప్ – రమేష్

దుస్తులు – ఎ. యస్. గాంధి

నృత్యం – శీను

స్టిల్స్ – డి. రాధాకృష్ణమూర్తి

స్టంట్స్ – సాంబశివరావు

కూర్పు – కోటగిరి గోపాలరావు, కోటగిరి వెంకటేశ్వరరావు

పబ్లిసిటీ ఇన్‌ఛార్జి – మోహన్‌కుమార్

పబ్లిసిటీ డిజైనర్ – ఈశ్వర్

ప్రొడక్షన్ కంట్రోలర్ – వి. కోటేశ్వరరావు

ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ – ఎస్. ఎ. టి. జనార్ధనరావు, ఏ. రామమోహన్‌రావు

కో-డైరెక్టర్ – కె. వి. యస్. కుటుంబరావు

అసోసియేట్ డైరెక్టర్ – టి. యమ్. సింగ్

అసిస్టెంట్ డైరెక్టర్స్ – కోయ సదాశివరావు, వంశీ

కెమెరామన్ – యస్. గోపాలరెడ్డి

అసిస్టెంట్ కెమెరామన్ – పి. శరత్, యమ్. వి. రఘు

ప్రొడక్షన్ మేనేజర్స్ – గొట్టేటి చలపతిరావు, యస్. సత్యనారాయణ, యస్. కామేశ్వరరావు

డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ : వి. యస్. ఆర్. స్వామి W.I.C.A

# కథకాదు జీవితం – "ఎదురీత"

---

జీవితం ఒక ప్రవాహం లాంటిది. ఆ ప్రవాహానికి ఎదురీది సాధించిననాడే జీవన మార్గం సుగమం అవుతుంది. ఎన్ని కష్టాలొచ్చినా గుండె ధైర్యంతో, మనోనిబ్బరంతో నిండుకుండలా తొణకకుండా నిజాయితీతో ఎదుర్కొంటున్న ధీరోదాత్త నాయకుని కథ – "ఎదురీత"

పల్లె పట్టులు ప్రజాజీవితాలకు సోపానాలు. పల్లెల్లో జీవితం వుంది. ఆ జీవితంలో మంచి – చెడూ వున్నాయి. ఆ రెండింటి సంఘర్షణలో అమాయకులు నలిగిపోతున్నారు. అక్రమదారులు పరాక్రమశులై చెలరేగుతున్నారు.

ప్రశాంతంగా, సాఫీగా సాగిపోయే గ్రామం. ఆ గ్రామంలో మంచి మనసుతో, నీతి – నిజాయితీలతో ప్రజాశ్రేయస్సే తన ధ్యేయంగా భావించి ఆ గ్రామాభివృద్ధికి తోడ్పడే యువకుడు మధు. అతని చల్లని నీడలో తల దాచుకోవాలని, అతని మంచి మనసును దోచుకుని, అతని ఆదర్శాలకు అండగా నిలిచిన టీచరమ్మ రాధ. గలగలపారే గోదావరిలా .... ఛెంగు, ఛెంగున గెంతుతూ మధు ఆనందమే తన సంతోషంగా బ్రతికెయ్యగలిగే మంగ. పడమంత్రపు సిరితో, విచ్చలవిడి ప్రవర్తనతో పెత్తందారీ గిరి చలాయించచూసే భూషయ్య. అధికారిననే అహంతో ప్రవర్తించక, మనసున్న మనిషిగా, మనుషుల్ని నిశితంగా పరిశీలించగలిగిన పోలీసు ఆఫీసరు ఆనందరావు ప్రధాన పాత్రలు. గోదావరి. కొబ్బరిచెట్లు, బోటు, లాంచీలు, అందమైన పల్లెటూరు. వీరందరిమధ్య వున్న వాతావరణం.

ఈ చిత్రం చూస్తే మీకే తెలుస్తుంది. ఇందులో వున్నది కథకాదనీ జీవితమనీ. ఆ జీవితంతో ఎన్నో మలుపులూ వున్నాయని.

# ... పాటలు ...

పాట 1

రచన : వేటూరి సుందరరామ్మూర్తి

పాడినవారు : యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

పల్లవి : గోదావరి పరదల్లో
రాదారి పడవల్లే
నీ దారి నీదే నన్నా
ఉయ్యాల లూగె యీ జగమంతా
ఊహల కందని వింత
ఈ లాహిరిలో నీ వెంత

చరణం : తానొక చోట తాడొక చేత – తోలు బొమ్మల ఆట
కోరిన రేవు చేరని నావ – పెదవి కందని పాట
అయ్యారే! మన జీవితమంతా – ఆశ నిరాశల సంత
ఈ లాహిరిలో నీ వెంత

చరణం : నింగి నేల బింతులాటలో – సంజ వెలుగుల సయ్యాట
ఏటిగాలికీ నీటి వాలుకీ – ఎదురీతే బ్రతుకంట
ఓ బాటసారీ! రేవును చేరి – నావలు మరిచే వంట....అవి
దేవుని దీవెనలంట ॥గోదావరి॥

పాట 2

రచన : వేటూరి సుందరరామ్మూర్తి

పాడినవారు : పి. సుశీల

పల్లవి : ఈ రాధ చివరికి ఏమైనా – ఆ గాధ నీదేలే ....
కలలన్ని అలలైన యమునానదిలో–కలతల కన్నీరే ॥ఈరాధ॥

చరణం : బృందావనిలో బిగి కౌగిలిలో
అల్లిక లేమాయె .... కలయిక లేమాయె
వ్రేపల్లియలో .... వేణువు యెదలో – గీతిక లేమాయె
మధురాపురిలో .... నడిరాతిరిలో – మాధవుడేమాయె ॥ఈరాధ॥

చరణం : మరుమల్లెలలో విరిజల్లులలో
మల్లిక లేమాయె .... మధురిమలేమాయె
ఆ కన్నులలో .... వెన్నెల గాచిన
ప్రశ్నలేమాయె
చేసిన బాసలు .... పూచిన ఆశలు ॥ఈరాధ॥
రాలిన పూలాయె

పాట 3 రచన : వేటూరి సుందరరామ్మూర్తి
పాడినవారు : పి. సుశీల, యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

అతడు : తొలిసారి ముద్దివ్వమంది
చెలి బుగ్గ చేమంతి మొగ్గ
ఆమె : పెదవులలో మధువులనే కోరి కోరి చేరి
ఒకసారి రుచి చూడమందీ
చిరు కాటు ఈ తేనెటీగ
అతడు : నీ పైట తీసి కప్పుకుంది ఆకాశం
తెరచాటు సొగసు లారబోసి నాకోసం
ఆమె : నీ చూపులు సోకి సొగసు వెల్లువలాయె ॥తొలిసారి॥
నీ ఊపిరి తాకి మనసు వేణువులూదె
ఆమె : నీ మనస్సు విప్పి చెప్పమంది మధుమాసం
సరి మల్లెపూలు గుప్పమంది నీ కోసం
అతడు : నీ నవ్వులలోనే వలపు గువ్వలు సాగె ॥తొలిసారి॥
నీ నడకలలోనే వయసు మువ్వలు మోగె
ఆమె : ఈ రేయి హాయి మోయలేను ఒంటరిగ
అతడు : ఇక రేపు మాపు తీపి వలపు పంటలుగ
ఆమె : నులి వెచ్చన కాదా మనసిచ్చిన రేయి ॥తొలిసారి॥
అతడు : తొలి మచ్చికలోనే సగమిచ్చిన హాయి

పాట 4 రచన : వేటూరి సుందరరామ్మూర్తి

పాడినవారు : యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

పల్లవి : తాగితే ఉయ్యాల .... ఊగితే జంపాల
తాగమంటె తంటారా .... తాగకుంటె యెట్టారా
తాగీ ఊగీ ఊరేగీ ... తైతక్క లాడర నాయ్యాల ॥తాగితే॥

చరణం : ఎత్తులు వేసి వేసి .... నెత్తెక్కి కూచున్నావు
నెత్తురు తాగి తాగే .... మత్తెక్కి వున్నావు
పంచాయతి బోర్డు ప్రెసిడెంటు వైనావు
కంచె నువ్వనుకుంటె చేనే మేసేవు
హా ! నక్క నక్క చూస్తావేరా
నక్క జిత్తుల నాయాలా ॥తాగితే॥

చరణం : బ్లాకు మార్కెట్టుచేసి లోపల్ని దోచావు
సర్కారు కన్నుగప్పి .... నేరాలు చేశావు
కొంపలెన్నో తీసి .... గొప్పోడివైనావు
నమ్మినోళ్ళను నీవు .... నట్టేట ముంచావు
మీసాలు తీసెయ్యరా .... మోసాల భూషయ్యా ॥తాగితే॥

పాట 5 రచన : కొసరాజు

పాడినవారు : యస్. పి. బాలసుబ్రహ్మణ్యం, యస్. జానకి

ఆమె : ఏ హా తైరికీ....
బాలరాజో బంగారుసామి
ఏ తల్లి కన్నదో రాజా నిన్ను ॥బాలరాజో॥

అతడు : ఆత్మీయమైన మీ అభిమానమునకు
ఆనందమున మేను పరవశించినదీ
మీ అండయే నాకు కొండంత బలము
మరచి పోలేనహో ! మీ అనురాగము

ఆమె : ఏ... హ తైరిరీ....
నీవు నడిచే బాట మల్లెపూ తోట
నీ మాటయే మాకు ముత్యాల మూట
ప్రజా సేవకే పుట్టావయ్యా
పదిమందికి భిక్ష పెట్టావయ్యా ||బాలరాజో||

అతడు : కరిగితే పసిడికి కాంతి వస్తుంది
త్యాగమే మనిషికి విలువ తెస్తుంది
నే కన్న కలలన్ని నిజమాయె నేడు
ఫలితమ్ము రాకుండ ఎవడాపలేడూ

ఆమె : ఏ.... హ తైరిరీ....
మంచికి నీవు మారు పేరయ్యా
మనుషుల్లోనా దేవుడవయ్యా....
ఊరి కొక్కడూ నీ వోటి వాడుంటె
దేశ మెన్నడో సౌభాగ్యమయ్యేది ||బాలరాజో||

పాట 6 రచన : శ్రీశ్రీ

పాడినవారు : యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

పల్లవి : ఎదురీతకు అంతం లేదా
నా మదిలో రేగే గాయం మానిపోదా
వాడిన ప్రేమ వసంతం
ఏనాడైన వికసించి రాదా ||ఎదురీతకు||

చరణం : సాగరమే నా చెరువ నున్నా – దాహం తీరదులే
తీరాలేవో చేరుతు వున్నా – దూరం మారదులే
ఇది నడియేట తీరాల వేట
ఇంకెన్నాళ్ళు యీ ఎదురీత ||ఎదురీతకు||

చరణం : చేయని నేరం చెలిమినికూడా – మాయం చేసెనా
మాసిన మదిలో మమతలుకూడా – గాయం చేసెనా
నా యను వారె పగవారైతే
ఇంకెన్నాళ్ళు యీ ఎదురీత ||ఎదురీతకు||

